KAVITANJALI



# అక్షరాంజలి

పాలమూరు సాహిత్య రంగం లో ముందుకు దూసుకువస్తున్న యువ సాహితీ తరంగం ఎన్. వి. రఘువీర్ ప్రతాప్. పాతికేళ్ళుగా రఘువీర్ ప్రతాప్ సాహితీ వ్యాసాంగం చేస్తున్నా,ఎన్నో రచనలు వివిధ పత్రికలలో అచ్చవుతున్నా ఇప్పటికీ ఒక పుస్తకంగా తీసుకురాలేదు కవితాంజలి వచ్చేదాక.తన కవితా సుమాలతో రఘువీర్ పాలమూరు సాహితీ సుగంధాలను వెదజల్లుతున్నాడు. మృదుభాషి గా, నిగర్విగా, సాదుస్వభావిగా, ఉన్నతమైన వ్యక్తిత్వాన్ని రూపుదిద్దుకున్న రఘువీర్ కవిత్వం కూడా అంతే మధురంగా ఉంటుంది. చల్లని వెన్నెలను ప్రసరించినట్టుగా ఉంటుంది. ఆ వెన్నెలలో కాసేపు తడుద్దాం. తనివితీరా రఘువీరుని కవిత్వాన్ని ఆస్వాదిద్దాం. కవితాంజలి తో పాలమూరు జిల్లా సాహిత్య చరిత్ర పుటల్లో ఒక పేజి అయినందుకు రఘువీర్ ప్రతాప్ ని మనసారా అభినందిస్తున్నా...,
మరిన్ని రచనలను వెలువరించాలని.. అక్షరాలతో అభిషేకిస్తున్నా...,

– భీంపల్లి శ్రీకాంత్



# కవితాంజలి



## ఎన్.వి. రఘువీర్ ప్రతాప్

# కవితాంజలి

6

ఎన్.వి. రఘువీర ప్రతాప్



పాలమూరు సాహితి
మహబూబ్‌నగర్

# కవితాంజలి

రచన: ఎన్.వి. రఘువీర ప్రతాప్
సర్వహక్కులు: రచయితవి
ప్రథమ ముద్రణ: అక్టోబర్, 2006
ప్రతులు: 1000
ప్రచురణ: పాలమూరు సాహితి
ప్రచురణ సంఖ్య: 6
వెల: 20/-

ప్రతులకు:-

1. శ్రీమతి జ్యోత్స్నాదేవి,
మన్మనాభవ మందిరం
ఇ.నెం.6-81/1,
టీచర్స్ కాలని, మర్లు,
మహబూబ్ నగర్ - 509 002.
ఫోన్. 08542-252506
సెల్. 9440551552

2. అధ్యక్షులు
పాలమూరు సాహితి
ఇ.నెం.8-5-10/12,
టీచర్స్ కాలని,
మహబూబ్ నగర్ - 509 001.
ఫోన్. 08542-270563
సెల్. 9885046622

పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయము, హైదరాబాద్
వారి ఆర్థికసహాయముతో ముద్రితం

# అంకితం



జ్ఞాన సాగరుడు, సృష్టి, స్థితి, లయకారకుడు
ప్రజాపిత బ్రహ్మకుమారీస్ ఈశ్వరీయ
విశ్వవిద్యాలయ వ్యవస్థాపకులు,
పరమపావనుడు, మా ప్రియాతి ప్రియమైన
"బాప్‌దాదా" దివ్య సన్నిధికి ప్రేమతో...




**భీంపల్లి శ్రీకాంత్**

అధ్యక్షులు

పాలమూరుసాహితి


# పాలమూరు కవితా కెరటం

పాలమూరు సాహితీరంగాన వినూత్న కవిత్వంతో ముందుకు దూసుకు వస్తున్న యువసాహితీ కెరటం ఎన్.వి. రఘువీరప్రతాప్. అలవోకగా కవిత్వం వ్రాసినా, ఆలోచించి కవిత్వం వ్రాసినా అందులో సాహిత్య ప్రతిభ కనిపిస్తుంది. గత దశాబ్దకాలంగా ఇటు కవిత్వాన్ని, అటు చిత్రకళను తన కలం కుంచెతో జీవంపోస్తూ తనదైన ముద్రను సొంతం చేసుకుంటున్నాడు. తొలిసారిగా తన కవితాసుమాలను అక్షరీకరించి సాహితీ పరిమళాలను పెదజల్లుతున్నాడు. మృదుభాషి, వినయ సంపన్నుడు అయిన రఘువీరప్రతాప్. అంత వీరుడు కాడు, ప్రతాపుడు కాడు. సాహితీ సౌశీల్యుడు, సద్గుణ మూర్తి, సౌమ్యుడు. అటవీ శాఖలో అధికారి అయినా, సాహితీ రంగాన రచనాధికారి.

మొత్తం 40 కవితలున్న ఈ కవితాసంపుటిలో వివిధ కోణాలకు సంబంధించి అక్షరబాణాలు సంధింపబడ్డాయి. తెలుగుదనం, పల్లె, కరువు, ప్రేమ, శాంతి, యువత వంటి అంశాలపై తన భావాల పరిమళాలు ప్రతిఫలించబడ్డాయి. ఇందులో కొన్ని శాంతియుతంగానూ, మరికొన్ని ఆవేశయుతంగానూ, ఇంకొన్ని ఆర్ధ్రయుతంగానూ కవిత్వీకరించబడ్డాయి.

మాతృభాషపై మమకారం, తెలుగుదనంపై అనురాగం ఈ కవికి అభిమానం. ఈ అభిమానం అందరికీ ఉండేదే. తన అభిమానం తెలుగుభాషపై ఎలా వుందో "తెలుగు పలుకు" కవితలో తెలుగుదనం, మాతృభాషపై గల గౌరవం ఏపాటిదో తన గుండెను మీటుతూ చెబుతాడు.

"తెలుగు వెలుగుల పరిమళాలను
గుండె గుండెకు పంచుదాం"

ఆ తెలుగు వెలుగు పరిమళాలు ఏవో, సాహితీ జగాన ప్రసిద్ధులైన వారందరికీ తెలుసు. తెలుగు భాష గొప్పదనమేకాదు, దాని చరితను నిలుపడానికి ప్రతినబూనుదామంటూ మనల్ని జాగృతపరుస్తాడు. మన తల్లి భాషను మరవద్దని సున్నితంగా మందలిస్తాడు.

'కవితాపుష్పం' కవిత్వం చదువుతూంటే అంతర్లీనంగానేకాదు, బహిరంగంగానే శ్రీ శ్రీ ఛాయలు కనిపిస్తాయి. ఈ కవిత్వంలో రఘువీర్ వాడిన ప్రతీకలు వాస్తవంగా అనిపిస్తాయి.

"చరిత్ర విత్తులు
ధరిత్రి నాటగా"

ఈ ఒక్క వాక్యం చాలు రఘువీర్ కవిత్వ ప్రతిభకు నిదర్శనం. 'కవితా పుష్పం' పూయిస్తూ, కావ్య ఫలాలను పండిస్తూ' అంటూ ఆశావహ దృక్పథాన్ని వెల్లడిస్తాడు. తన కవితా నిర్దేశనాన్ని తెలుపుతాడు.

విశ్వమంతా శాంతిసుమాలు విరబూయాలని, విశ్వమానవ శ్రేయస్సును ప్రతి ఒక్కరూ ఆకాంక్షించాలని కోరతాడు. తన 'శాంతి కేతనం' కవితలో.

ఈ కవికి ప్రేమోద్వేగం ఎక్కువ. ఏదీ తనలో దాచుకోలేడు. అది ఆనందమైనా, విషాదమైనా అదే నిజమైన ప్రేమకు పరాకాష్ట.'నీ కోసం చిగురిస్తా' కవితలో

"కొన ఊపిరిగా ఉన్న నాకు
కొత్త ఆశలు తొడిగినావు" అనే కవితలో

భగ్న హృదయపు ఆవేదన ఉంది. ప్రేమ చిగురించిందనే చిరు ఆశ ఉంది. ప్రేమే కాదు, ప్రేమించే మనస్సులకు ప్రతి రోజూ కొత్తగానే ఉంటుంది. ప్రతి ఉషోదయం ఉత్సాహభరితంగానే ఉంటుంది. ప్రియురాలి చిరునవ్వుకై మళ్ళీ మళ్ళీ జన్మిస్తాననే ప్రియుడి అంతరంగాన్ని ఎంతగా చెప్పినా తక్కువే. అది ప్రేమో, వ్యామోహమో ఈ కవిత చదివితే తెలుస్తుంది.

తెలుగువాడి నేలలో పండుగుల సంబరాలు రాను రాను అడుగంటిపోతున్నాయి. ఒకనాడు పండుగంటే ఊరంతా సందడి. నేడు ఆ సందడి ఏ ఇంట్లోనూ కానరాదు. ప్రపంచీకరణ నేపథ్యంలో పండుగలన్నీ నేలకొరిగాయి. విదేశీ పండుగలు మాత్రం అంబరాన్ని అంటుతున్నాయి. తన చిన్ననాటి పండుగ ఎలా ఉండేదో, ఇప్పుడు ఎలా ఉందో 'జీవనాడి' కవితలో కవి చక్కగా ఉదహరించాడు.

"చిన్నప్పుడు పండుగంటే
భలే సంబరమవుతుండె"

అనే కవితలో కవి హృదయం ఆర్ద్రతమవుతుంది. చిన్నపిల్లాడి గొంతవుతుంది. 'ఇప్పుడు ఎక్కడా' అనే ఆవేదన ధ్వనిస్తుంది.

"ఇప్పటి ఈ సంక్రాంతి
వెలుగులేని ఒక క్రాంతి"

అనే వాస్తవం మన కళ్లెదుట నిలుస్తుంది. కాదనలేని కఠోరసత్యమై

పాలమూరు అంటే చాలామందికి అలుసు. వెనకబడిన జిల్లా అని, కరవు జిల్లా అని, వలస జిల్లా అని. ఇది ఒక పార్శ్వం మాత్రమే. పాలమూరంటే కవులు, కళాకారులు, రచయితలు, మేధావులు అనేది కొద్దిమందికే తెలుసు. ఇది మరో కోణం. అయితే కరవు జిల్లా అనేపేరు సార్థకం చేసుకుని, నిత్యనూతనమై భాసించడం ఒక పాలమూరు వాసిగా నాకు బాధేననిపిస్తుంది. పాలకులు చేసిన కుట్రకు పచ్చని నా పాలమూరు వసివాడిపోయింది. కరువు కోరల్లో చిక్కి విలవిలలాడుతోంది. పాలమూరు కరవు వల్ల ఎలాంటి దుర్భిక్షం తాండవం చేస్తుందో ఈ కవి మన కళ్లెదుట దృశ్యీకరిస్తాడు.

"చిగురించని ఆశలతో
వలస మాత్రం తప్పదాయె" అంటూ

వలస పక్షుల జీవన వెతలను మనముందు నిలుపుతాడు 'ఎండమావి'

"పంట పొలాల నొసట
పగుళ్ళు రేఖలు విచ్చుకుంటున్నవి"

ఈ కవిత పాలమూరు బీడుభూములకు నిదర్శనంగా నిలుస్తున్నది. మోడువారిన భూముల వెతలను తెలుపుతున్నది. ఈ దౌర్భాగ్యం పాలమూరుది కాదు. పాలమూరును పాలిస్తున్న పాప పాలకులది. దుష్ట

వృత్తిరీత్యా రఘువీరుది అటవీ శాఖ అవడంతో మొక్కలను నాటండని, అవి భావితరపు సంపదలని ప్రభోదిస్తున్నాడు.

"క్షామమెంచువాని క్షేమం కోరు
క్షమా సంస్కృతి వృక్షం తీరు"

అంటూ 'వృక్ష సంస్కృతి'ని కీర్తిస్తున్నాడు. వృక్ష సంపదని కాపాడమని అర్థిస్తున్నాడు.

మనిషి చివరి మజిలి స్మశానవాటిక . మనిషి జీవితంలో తప్పని సరైన స్మశాన వాటిక గూర్చి ఈ కవి తన కవిత్వంలోకి తీసుకొచ్చాడు. ఎవరు ఎన్ని విధాలుగా చెప్పినా రఘువీర్ అభివ్యక్తి ఆలోచించదగ్గది. చూడండి.

"అనంతశాంతి నిచ్చి
శాశ్వత సేద తీర్చే
మరో అమ్మవడిలాంటి
కమ్మని అమృత హృదయిని
ఈ స్మశానవాటికామ తల్లి"

రాజులైనా, కూలీలైనా, ధనవంతులైన, పీడితులైనా చివరికి చేరుకోవల్సింది స్మశానానికేనని, ఈ స్మశానంలోనే సమానత్వం సిద్ధిస్తుందనే శాశ్వత సత్యాన్ని కవి పేర్కొనడం అతని లోచూపుకు నిదర్శనం. క్షరం కానిది అక్షరం. అక్షరం గూర్చి కవి ఏమంటున్నాడో చూడండి.

"నేను అక్షరాన్ని
తెలుగుతల్లి కరుణాకటాక్షాన్ని
చీకటిలోకాన ఉషోదయాన్ని
అభయమిచ్చే ఆయుధాన్ని"

కవి అక్షరములో అంతర్లీనమై ఆత్మాశ్రయ రీతిలో కవిత్వీకరిస్తాడు. అక్షరం లేనిదే బుగే లేదంటాడు. అందుకే జనం గళాన యుగళమై నిలుస్తానంటాడు. అక్షర ప్రతాపాన్ని వీరంగా చెబుతాడు.

రైతన్నలు పంటలకోసం, కూలీలు పనులు కోసం, రాజకీయ నేతలు పదవుల కోసం, దొంగలు దోపిడికోసం ఎలా ఎదురుచూస్తున్నారో "ఎదురుచూపు" కవితలో కవి వాస్తవాన్ని ప్రతిఫలింపజేశారు. నేటి యాంత్రిక, కంప్యూటర్ యుగంలో కూడా మనిషి ఇంకా మారలేదని, రాతియుగపు పోకడలతోనే ఆలోచిస్తున్నాడని, ఆ తీరుపోయి కొత్తలోకం కోసం ఎదురుచూడాలని ఆశిస్తున్నాడు.

దేశానికి పట్టుగొమ్మలు పల్లెలు. ఇది ఒకనాటి నినాదం. ఈనాటి పల్లెలు స్మశాన వాటికల రూపాంతరాలు. ఇది నేటి వాస్తవం. నేటి పల్లె ఆనవాలు ఎలా ఉన్నాయో 'పల్లెమారిపోతున్నది' కవితలో పల్లెదనం పోయి, పాశ్చాత్య గాలి వీస్తుందంటూ ఆవేదన చెందుతాడు కవి.

"దాహార్తి తీర్చు బావుల్లేవు
సేదతీర్చు చెట్లులేవు"

ఒకప్పుడు పల్లె అంటే సంస్కృతి చిరునామా. నేడు ఆ సంస్కృతి పాశ్చాత్య మాయలో కలిసిపోయిందంటాడు. పల్లె చిరునామా దొరకడం కష్టమంటాడు. నిజమే పల్లె అంటే ఒక అనురాగం. ఒక ఆత్మీయత. నేడు అది యాంత్రికమైన జీవనం. జనం లేని పల్లెను ఊహించలేము. పలకరింపు లేని జనాన్ని కూడా అంతే.

పాలమూరు కరవు గురించి ఎంతగా చెప్పినా తక్కువే, అది సముద్రం. పాలమూరులో పుట్టినవాడు కరవు జిల్లా వాడిగా అవతారమెత్తుతున్నాడు. పర్యాయపదంగా ప్రచారమవుతున్నాడు. ఇక్కడి కరువు దశాబ్దాల నాటిది. ఇక్కడి ఆకలి ఎండిన డొక్కలి నాటిది. తన "కరువుగోస"లో

"పేగులెండిన వాగులన్నీ
కరవు కరువని అరవసాగే"

అనే కవి భావ చిత్రం కరువుకు నిదర్శనంగా నిలుస్తున్నది. ఒకప్పుడు పాలు, పెరుగు సమృద్ధిగా లభించే, పచ్చని పసిడి పంటలు పండించే పాలమూరులో నేడు కరువు రక్కసి కరాళనృత్యం చేయడం ఎవరికైనా బాధాకరమే. రాయలసీమను చూసి శ్రీనాథుడు ఎలా మధనపడ్డాడో, పాలమూరు కరువును చూసి రఘువీర్ అంతే బాధపడ్డాడు.

పాలమూరు కూలీలంటే భారతదేశమంతా భలేగిరాకీ. భారతదేశంలో ఏ ప్రాజెక్ట్ అయినా, ఏ భారీ నిర్మాణం అయినా పాలమూరు శ్రమ సంపద అక్కడ మెరుపు చుక్కై మెరుస్తుంది. చెమట చుక్కై నవ్వుతుంది. పాలమూరు కూలీలు ఎంతగా పని చేసినా, వాళ్ళ రెక్కలు ముక్కలయినా వారి శ్రమసంపదకు ఖరీదు కట్టే బడాబాబులు ఎవరూ లేరంటే అతిశయోక్తి ఎంతమాత్రం కాదు. "ఏది మాకు దారి" కవితలో

"మా రెక్కలు ఆడనిదే
మా చెమటలు చిందనిదే" అంటూ

కూలీల పక్షపాతమై, వారి ప్రతినిధిగా గొంతెత్తుతూ కొత్తరాగం తీస్తున్నాడు. మాకు దారేదని ప్రశ్నిస్తున్నాడు. నాయకుల డొల్లతనాన్ని, జులాయితనాన్ని కడిగేస్తున్నాడు.

అలాగే "భవిత గమనం ఎక్కడికో" లో స్వార్థచింతనను, "సమైక్యతా సారథి" లో యువతకు మార్గనిర్దేశనం చేస్తున్నాడు.

రఘువీర్ కవిత్వానికి మచ్చుతునకగా ఈ కవితా సంపుటిలో "రండి మనదేశాన్ని రక్షించుకుందాం" అంటూ రాజకీయ నాయకుడి అవతారమెత్తి మనమూ మనల్నీ రక్షించుకుందామంటూ వ్యంగ్య బాణాలను సంధిస్తాడు. 'మనదేశం ఏమైపోతేనేం, మనం హాయిగా బ్రతికేద్దాం' అంటూ రాజకీయ స్వరూపాన్ని ప్రదర్శిస్తాడు. రాజకీయ డొల్లతనాన్ని ఎండగడతాడు.

రఘువీర్ కవిత్వంలో ముందే చెప్పినట్టుగా అన్నీసమపాళ్లలో నవరసాల సమ్మేళనం కనిపిస్తుంది. ఇంకా భావాభివ్యక్తికి, కవిత్వగాఢతకి పదునైన కవిత్వం వ్రాయాలి. అపుడే రఘువీర్ కవిత్వంలో వీరుడు అవుతాడు. సాహిత్యంలో ప్రతాపుడై నిలుస్తాడు. ఆ దిశగా రఘువీర్ అడుగులు వేస్తాడని, కవితా కలం ఝుళిపిస్తాడని ఆశిస్తూ, రఘువీర్ చిరు ప్రయత్నాన్ని మనసారా అభినందిస్తున్నాను. పాలమూరు సాహితీ కోశాధికారిగా ఉంటూ సాహిత్య సేద్యం చేస్తున్న కవిరఘువీర్ ముమ్ముందు మరిన్ని కవితా సంపుటాలను వెలువరించాలని ఆశిస్తున్నాను. ఈ "కవితాంజలి" పాలమూరు సాహితీ 6వ ప్రచురణగా మీ ముందుకు వచ్చింది. అందుకుని ఆశీర్వదించండి. రఘువీర్ సాహితీ పరిమళాలను ఆఘ్రానించండి.

అభినందనలతో...

తేది 11-04-2006<br>
పాలమూరు

భీంపల్లి శ్రీకాంత్<br>
అధ్యక్షులు<br>
పాలమూరు సాహితి



**కపిలవాయి లింగమూర్తి**<br>
ప్రఖ్యాత పరిశోధకులు<br>
నాగర్‌కర్నూలు

# భావవీచిక

చి. రఘువీర్ ప్రతాప్ వర్ధిష్ణులైన కవి కుమారుడు. వీరిది విద్యావంతుల వంశం. తండ్రిగారైన శ్రీ నారాయణదాసు శ్రీరామాచార్యులు మంచి రచయిత. మరియు కవి. అందువల్ల రఘువీర్ సహజంగానే కవికుమారుడు. హిందూ జీవన విధానంలో వ్యక్తి ఏ మతంలో మరియు ఏ వృత్తిలో ఉన్నా వానికా మతం మరియు ఆవృత్తిలోనే ముక్తి. కనుక దాన్ని విడిచి వేరేదానికి పరుగెత్తనవసరం లేదు. అట్లాగే ఆధ్యాత్మికత మరియు కవిత్వం కూడ అంతే. ఏ వృత్తిలో ఉన్న వారికావృత్తిలోనే వాని సారూప్యత గోచరిస్తుంది. రఘువీర్ ప్రస్తుతం తండ్రి స్థానంలో నిలిచి అటవీ శాఖలో పనిచేస్తూ సామాజిక అడవుల విభాగాన్ని చూస్తున్నాడు. పాత అడవులను రక్షించటం క్రొత్త వానిని పెంచటం వీరి పని.

ఒకప్పుడు జిల్లాలో అటవీ సంపద, గో సంపద పుష్కలంగా ఉండి పాడిపంటలకు కొదువ ఉండేదికాదు. కాని స్వాతంత్ర్యానంతరం ముందుచూపు లేక సామాన్య జనం అరణ్యాలలోని మహా వృక్షాలన్ని మట్టుబెట్టగా ఈనాడు జిల్లా వర్షాభావానికి గురియై కార్మికులు వలసలకు గోవులు కబేళాలకు వెళ్ళవలసిన దుస్థితి ఏర్పడింది.

నేలపై పెరిగే అడవులవలెనే మననోట వెలువడే వాఙ్మయం గూడ ఒక అరణ్యమే. ఈ అరణ్యాన్ని విద్యారణ్యులెందరో ప్రోది చేసి పోషించి నిలిపినారు. కాని ఇపుడు పాశ్చాత్య విద్యా ప్రభావంవల్ల ప్రాచీన వాఙ్మయంలోని మహా కావ్యాలైన భారత, భాగవతాదులు పఠన, పాఠాలలోలేక సంస్కృతీ సభ్యతల క్షామమేర్పడింది. ఒకపుడు మన సమాజంలో అవినీతి పరులు, దుర్మార్గులు పుట్టి తలెత్తుకోలేదు. కాని ఈనాడు తలెత్తుకుంటున్న దుర్మార్గులంతా అవిద్యావంతులుగాదు. కారణం?

మనకిపుడు పురాణ కావ్య పఠనం తప్పింది. కాబట్టి వాని వల్ల కలుగ వలసిన వ్యవహార విదేశివేత రక్షతయే-మనష్యులెట్ల నడుచుకోవలెనో, సమాజానికి శుభాన్ని, క్షేమాన్నాపాదించని పనులెందుకు మానవలెనో తెలియకుండ పోయింది. అందువల్ల ఈనాడు అటవీ శాఖ వారు వాతావరణ రక్షణకు, వర్షాభావాన్ని దూరం చేయటానికి సామాజిక అడవుల పథకం ఎట్లా చేపట్టి, వానినెట్లా పెంచి పోషిస్తున్నారో అట్లాగే ఈ నాటి కవులు మళ్ళీ మన ప్రాచీన సంస్కృతీ సభ్యతలను సమాజానికి తెలిపి నిలుపుకునేందుకు కావ్య పురాణ మార్గాలలో నడవ వలసి ఉంది. ఇది భాద్యత ఎరిగిన కవుల యొక్క విధి.

కవులెప్పుడైనా స్వస్థాన వేషభాషాభిమానం కలవారే ఉంటారని ఆంధ్ర శబ్ద చింతామణి యొక్క వాక్కు. అయితే ఈ కవి పాలమూరు జిల్లా వాడైనందుకే కృతిని "పిల్లలమఱ్ఱి" స్మరణతో తానటవీ శాఖలో పనిచేస్తున్నందుకు సృష్టిలోని స్థావరాలలో వృక్షాలే చేతనం కలవి కాబట్టి వృక్షం మనకే సందేశాన్నిస్తుందో చాటి చెప్పే "వృక్షసంస్కృతి"తో ప్రారంభించటం, అనంతరం తమ గురువును మరియు పరమాత్మను స్తుతించటం సంవత్సరానికి వసంతమాది ఋతువు కాబట్టి వసంత వర్ణనతో పాఠకులను కావ్యంలోనికి ప్రవేశ పెట్టడం ఇతని యొక్క సాంప్రదాయ నిబద్ధతను తెలుపుతుంది. ఇతని యొక్క ఈ ఖండ కావ్య సంపుటి ఒక చాలీసా అనగా నలువది ఖండికల సమాహారం. నలువదిని సంస్కృత పరిభాషలో మండలమంటారు. మండలమంటే జిల్లా గూడా. కనుక ఇందులోని "పల్లె మారిపోతున్నది," "కరువుగోస," "ఎండమావి", "ఏది మాకు దారి" వంటి శీర్షికలలో ఈ జిల్లాలోని మండలాల స్థితి, "ఎదురుచూపులో" ఇక్కడి మండలాలలోని ప్రజల యొక్క నాడీ మండలాల స్థితి కండ్లకు కడుతుంది. ఇందులోని కవితాఖండికలను నేను విశ్లేషించడం లేదు. ఆ పని పాలమూరు సాహితీ అధ్యక్షుడు భీంపల్లి శ్రీకాంత్ గారే శుష్టుగా చేసినాడు. అమాయకుల "భవితగమనమెక్కడికో" తెలియటం లేదు. అందువల్ల యితడు "రండి శాంతికేతనం ఎగురవేద్దాం", మతములన్నీ హితముకోరి జతగ కలిపి శ్రుతులు పాడగా తెలుగు జ్ఞానం పంచుదాం దేశ గౌరవం పెంచుదాం అని ఆహ్వానిస్తున్నాడు. కనుక పాఠకులీతని పిలుపునందుకుని ఈ తరంగాలను స్వాగతిస్తారనే నేనాశిస్తున్నాను.

అట్లాగే ఈతని లేఖిని ఈ తరంగాలే కాక ప్రవాహాలను కూడా జాలువారించవలెనని కోరుతున్నాను.

**కపిలవాయి లింగమూర్తి**
సాహిత్యారాధకుడు,
ఇ.నెం.17-110, వాణి సదనం
విద్యానగర్‌కాలనీ, నాగర్‌కర్నూలు
ఫోన్.నం.958540-226437.

తేది.20.06.2006.
నాగర్‌కర్నూలు



**డా॥ ఉందెకోడు రత్నయ్య**
ప్రముఖ పరిశోధకులు
మహబూబ్‌నగర్

## " ఆకాంక్ష "

ఎస్.వి.రఘువీర ప్రతాప్ అటవీశాఖలో ఉద్యోగి. తండ్రి నారాయణదాసు శ్రీరామాచార్యులు. వీరు చాలా గ్రంధాలు రచించారు. తండ్రి ప్రభావం వల్ల కవితలు రాస్తూ తనదైన ఒక కవితోద్యాన వాటిక నిర్మించుకున్నాడు. శీర్షికలు అన్నీ ఆధునికము, ఇందులో 41 ఖండకలున్నాయి. దీనిని 'ఖండ కావ్య సంపుటి' అంటే పద్యాలున్నాయేమో అనిపిస్తుంది. కావున కవితా ఖండికల సంపుటి అందాము. అలా దీనిని "కవితాంజలి" పేరుతో తీసుకొస్తున్నాడు రఘువీరప్రతాప్.

నేను ఈ కవితలన్నింటిని చదివాను. కవి హృదయమేమిటంటే చాలామంది ఆధునిక కవుల వలెనే సమాజాన్ని మార్చాలి, మంచిని పెంచాలి, వంచనను త్రుంచాలి, దేశాన్ని రక్షించుకోవాలని తపన. ప్రజల ఇబ్బందులు తొలగాలని ఎదురుచూపు. పల్లెలపై పట్టణవాసుల ప్రభావం పడి మారిపోతున్నది. ఇవన్ని కవికి గల విశాలమైన నిశిత దృష్టి తెలుస్తుంది. ఈ కవితలన్నింటిలో సహజమైన భావాలు, సులభమైన భాష పాఠకుల్ని ఆమూలాగ్రం చదివిస్తుంది. మళ్ళీ చదవాలనిపించే కవిత్వం. ఆలోచనామృతం, చమత్కారం, ఆశ్చర్యం, ఆనందం కలిగిస్తుంది. ఆనందమే కవితకు పార్యంతిక ప్రయోజనం. ఈ ఆనందం కలిగించే కవిత ద్వారానే నీవనుకున్న మార్పు అభివృద్ధి సాధ్యమవుతుంది.

కవిత్వమొచ్చినా, కక్కు వచ్చినా ఆగదు అంటారు. దానినే 'గుండె గొంతుకలోన కొట్లాడుతుంది. కూసుండ నీదురా కాసింతసేపు' అన్నారు ఎంకిపాటల కవి. రఘువీర ప్రతాపు సమాజాన్ని చూస్తున్న పుడు ఇతని మనస్సు స్పందించిన రీతి కవితలు రాశాడు. ఇంకా చమత్కారం పెంచి మళ్ళీ మళ్ళీ చదువాలనిపించే రచనలు ఇంకా చేస్తారని ఆకాంక్షిస్తూ, ఆశీర్వదిస్తూ సెలవుతీసుకుంటాను.

**డా॥ ఉందెకోడు రత్నయ్య** ఎమ్.ఎ., పిహెచ్‌డి.
1-4-177/4, బాయమ్మతోట, మహబూబ్‌నగర్
ఫోను : 08542-242520 సెల్ : 94406 60632



**డా॥ హన్మంతు**
అర్థశాస్త్ర ఉపన్యాసకులు
మహబూబ్‌నగర్

## "కవితాన్వేషణ"

నేను ఈ కవితలన్నింటిని చదివాను. మిత్రుడు శ్రీ ఎన్.వి.రఘువీరప్రతాప్ కలం నుండి జాలువారిన ఈ కవితా సంకలనము అద్భుతంగా ఉన్నది. మిత్రుడు శ్రీ ఎన్.వి.రఘువీరప్రతాప్‌తో నాకు 1985-86 నుంచి పరిచయము ఉంది. మిత్రుడు ఉద్యోగ సంఘ కార్యక్రమాలలో చురుకుగా పనిచేస్తున్నారు. జిల్లా అటవీ శాఖ ఉద్యోగుల సంఘంలో వివిధ స్థాయిలలో పనిచేశారు. 2002లో అచ్చంపేటలో జరిగిన మహబూబ్ నగర్ జిల్లా టి.ఎన్.జీ.వోల ఫారెస్ట్ ఫోరం ఎన్నికలలో జిల్లా అధ్యక్షునిగా అత్యధిక మెజారిటీతో గెలుపొంది 2006 వరకు పదవీ భాధ్యతలను నిర్విరామముగా కొనసాగించారు. ఇటీవలే జిల్లా బి.సి. ఉద్యోగుల సంక్షేమ సంఘంలో జిల్లా కార్యదర్శి పదవిని చేపట్టారు. 'ఆల్ ఇండియా ఆర్టిషియాన్స్ అసోషియే షన్' 'వి.బో.పా' విభాగపు మహబూబ్‌నగర్ జిల్లా ప్రధాన కార్యదర్శిగా పనిచేస్తున్నారు. ఇంతకు ముందు మిత్రునిలో ఒక అధ్యాత్మిక వ్యక్తిని గమనించాను. ఇప్పుడు ఒక యువ కవిని పరిచయం చేసుకున్నాను . 'పల్లె మారి పోతున్నది' 'ఎదురుచూపు' 'ఏది మాకు దారి' 'నీకోసం చిగురిస్తా' 'తెలుసుకో మసలుకో' 'తెలుగు తల్లికి వందనం' అనే కవితలు నన్ను చలింపచేసినవి. ప్రతి కవితలో ఒక ఆధునిక భావం, ఒక ఆత్మ శోధన, ఒక సందేశం, ఒక సంస్కరణలు కనబడుచున్నవి.

ఈ కవితలు వాస్తవ దృక్పథాన్ని సంతరించుకున్నవి. సమాజంలో ప్రతి మనిషిని కదిలించగల సత్తా ఉన్నవి. మిత్రుడి అలోచన ధోరణికి జోహార్లు. భవిష్యత్తులో ఎన్నో ఇంతకన్నా గొప్ప భావాలను తెలిపే కవితలను అందించి సమాజ మార్పుకు సంఘసంస్కరణకు మీ వంతు కృషి చేస్తారని భావిస్తున్నాను. మీ ప్రయత్నానికి భగవంతుడు అన్నివిధాల తోడ్పడాలని మనస్పూర్తిగా కోరుకొంటున్నాను....

**డా॥ హన్మంతు** ఎమ్.ఎ., పిహెచ్‌డి.
అర్థశాస్త్ర ఉపన్యాసకులు, ప్రభుత్వ బాలుర జూ.కళాశాల,
మహబూబ్‌నగర్. సెల్ : 9440788406

తేది : 16.02.06
మహబూబ్‌నగర్

## "కృతజ్ఞతాంజలి"

నాలో కల్గిన భావ సంఘర్షణకు అక్షర రూపాన్నిస్తూ అప్పుడప్పుడు నేను రాసుకున్న ఈ కవితలు కొన్ని వివిధ పత్రికలలో ప్రచురింపబడ్డాయి. వీటిని ఒక చిన్న పుస్తక రూపంలో తీసుకోస్తే బావుంటుందన్న సన్నిహిత మిత్రుల సలహా, సహకారాలతో నేడిది కార్యరూపం దాల్చి మీ చేతుల్లోకి వచ్చింది. దీనిని చదివి, మీ అమూల్య సూచనలను సలహాలను అందిస్తే, మా ఈ మొదటి ప్రయత్నానికి అవే ఆశీస్సులుగా భావిస్తాను.

ఈ పుస్తకానికి అన్నీ తానే అయి ఒక రూపాన్ని సంతరింపజేసి 'పాలమూరు కవితా కెరటం 'గా తన అభిప్రాయాన్ని అందించిన కవి మిత్రులు, 'పాలమూరు సాహితి' అధ్యక్షులు శ్రీ భీంపల్లి శ్రీకాంత్ గారికి, 'భావ వీచిక' ను అందించిన పాలమూరు జిల్లా ప్రముఖ పండితులు, ప్రఖ్యాత పరిశోధకులు అయినా శ్రీ కపిలవాయి లింగమూర్తి గారికి, చక్కని సూచనలిచ్చి అమూల్యమైన అభిప్రాయాన్ని 'ఆకాంక్ష' రూపంలో అందించిన కవి పండితులు శ్రీ డా. ఉందేకోడు రత్నయ్య గారికి, 'కవితాన్వేషణ' ను అందించిన మిత్రులు శ్రీ డా.ఎస్.హన్మంతు గారికి, చక్కని డి.టి.పి వర్క్ చేసి ఇచ్చిన మిత్రులు శ్రీ కే.నాగేశ్వర్, డైరెకర్ శ్రీ గణేశ్ సాఫ్ వేర్ గారికి, శ్రీ కె. యాదగిరి గారికి, అందంగా అచ్చువేసి ఇచ్చిన మిత్రులు శ్రీ శంకర్, మైత్రి ప్రింటర్స్ అధినేత గారికి, అందమైన ముఖచిత్రం డిజైన్ చేసిన శ్రీ దార్ల విశ్వనాథ్ గారికి...

నాకు జన్మనిచ్చిన నా తల్లిదండ్రులు శ్రీమతి వెంకటశేషమ్మ, శ్రీరామాచార్యుల వారికి మరియు సహజీవన ప్రదాతలైన శ్రీమతి పద్మావతమ్మ, శ్రీ పేపూరి జానకిరాముల గార్లకు నా హృదయపూర్వక సుమాంజలులు అర్పిస్తున్నాను.

అలాగే ఈ పుస్తకానికి సహాయ సహకారాలు అందించిన మిత్రులు శ్రీ గన్నోజు విష్ణుమూర్తి, జిల్లా సహకార మార్కెటింగ్ సొసైటీ, చైర్మన్ అచ్చంపేట గారు, శ్రీ కే. వెంకట్రాములు, ఉప అటవీ డివిజినల్ అధికారి, మెదక్ జిల్లా గారు, శ్రీ ఎన్. శ్రీనివాసులు, స్పెషల్ ఆర్.ఐ. మరియు టౌన్ టి.ఎన్.జి.వో.ల సెక్రటరీ గారు, శ్రీ పి.వి. రామకృష్ణ, ఏ.ఐ.ఎమ్.ఇ., అటవీ క్షేత్రాధికారి, ఆమనగల్లు గారు, శ్రీ డి. చంద్రయ్య, అటవీ క్షేత్రాధికారి, కోడంగల్ గారు, శ్రీ సాయిరెడ్డి, సెక్షన్ అధికారి, న్యూటౌన్, మహబూబ్‌నగర్ గారు, శ్రీ ఎడ్ల రాజేందర్ రెడ్డి, దేపల్లి గ్రామము గారు మరియు శ్రీ డి. భజరంగ ప్రసాద్ తండ్రి దుగ్యాల లక్ష్మయ్య, ఏ.ఎస్.డబ్ల్యు.ఓ., హైదరాబాదు గార్లకు మరియు ఆదరిస్తున్న ప్రతి ఒక్కరికి నాహృదయపూర్వక కృతజ్ఞతాభివందనములు.

సదా మీ శ్రేయోభిలాషి
ఎన్.వి.రఘువీర్ ప్రతాప్
పాలమూరు.



# పదండి ముందుకు



## పిల్లలమర్రి

తర తరాలుగా పిల్లలూడలకు తల్లిగా
నిరంతర నిండు గర్భిణిలా
తలలార బెట్టుకుంటున్న తరుణిలా
ప్రశాంత నిత్య వసంతానికి ప్రతీకలా
మానవత్వపు వృక్షమాతృకలా
నిలిచి ఉన్నది ప్రకృతి వరాలసిరి
పసిడి పాలమూరున నా పిల్లలమర్రి

## సద్భావన

బుద్ధియనే క్షేత్రంలో
జ్ఞానమనే విత్తనం నాటి
దానికి స్నేహమనే నీరుపోసి
వ్యర్థగుణాల కలుపుతీస్తే
చిరుఆశల చిగురువేసి
సమర్థత సారంతో ఎదిగి
సంతుష్టతా, ప్రసన్నతా అనే
పువ్వులు విరబూస్తాయి, అవి
హృదయాలన్నింటి నిండా
సద్భావనా పరిమళాలు నింపుతాయి.

## వృక్ష సంస్కృతి

నాటవోయి ఒక్కటైన
చక్కని ఓ మొక్కను
నలుదిశల ప్రకృతికి
నాంది నీవు పలుకుటకు
పొదుపు చేయు యుక్తికి
పొందికైన సంపదవలె
కాటువేయు కరువునకు
ధీటయిన బలిమిలాగు
కబళించే కాలుష్యాన్ని
సంబాళించే సరి దిశగా
కరుకు గుండె కరుగురీతి
వనం పెంచు మంచిని పంచు
క్షామ మెంచువాని క్షేమం కోరు
క్షమా సంస్కృతి వృక్షం తీరు
ధనం కన్న వనం మిన్న అన్నది అక్షరసత్యం
మనసులోన మలినమున్న మనిషికైన
మమతపంచు అను నిత్యం



## గురుబ్రహ్మ

మంచి గుణగణాలను ఏరి
ఋతుపవనాలుగా మార్చి
మా హృదయ సేలలపై
చల్లని కరుణాక్షరాల
వానలు కురిపింపజేస్తూ
పండింతురు చక్కని
సుగుణ సంపద పంటలనెన్నో
మాలో ప్రతిఫలింపజేతురు
ఆరని కోటి వెలుగులనెన్నో
మా బంగరు భవితకు
వేస్తారు చల్లని పూలబాటలెన్నో
నేటి ప్రతి మనీషి, ఒకనాటి విద్యార్థి
ప్రతి విద్యార్థి ఒక గురువు సృష్టి
అందుకే గురుః బ్రహ్మ, గురుః విష్ణువు
గురుదేవో మహేశ్వర,
గురు సాక్షాత్ పరబ్రహ్మం
తస్మైశ్రీ గురవే నమః
అని స్తుతిస్తూ నిత్యస్మరణ చేస్తున్నాము
మీరుచూపిన బాటలో పయనిస్తున్నాము.

# పరమాత్ముని మహిమ

నీ మహిమ ఎంతని
ఈ మహిని తెల్పెదను
ఓ పరమ పావన
ఓ పరందామ వాస
నీ రూపం జ్యోతి స్వరూపం
అనుభవాన అది అపురూపం
బాధల భవ బందాలలో నుంచి
బాహ్య లోకాల తేలింతువు
అనునిత్యం నీ సాన్నిత్యం
నా హృదయానికది స్వాంతనం
ముద్దు మురిపాన వినిపింతువు
ముగ్ధ మోహన మురళీగానం
అలవికాని జ్ఞానసముపార్జనం
ఆచరణలో అతి సులభతరం
బురద అంటని కమలమల్లె
బుద్ధితోడ రాజయోగం నేర్పి
చేశావు మా జీవితం నందనవనం
తీర్చావు మా భవితను భవ్యం దివ్యం





# వేదాంతవాణి

కదిలింది విజ్ఞానరథం
చెదిరింది అజ్ఞానపథం
ఇకచేరాలి ప్రగతిపథం
జిజ్ఞాసుల చేయుట మనోరథం
దివ్యచరితగల జ్ఞానరథం
అచలభోదనే వారిమతం
పూర్ణజ్ఞానమే వారిహితం
గురుబ్రహ్మమే దీని సారథి
సుజ్ఞాన నిధులు గల మహారథి
తరలి చేరుటే మనందరివిధి
అక్కడేవుంది మోక్షసాధనకు విడిది
అదే అదే మనోవికాస జలధి
అచలామృతాన్ని అందించె
మహిమాన్విత హిమవాహిని
అవిద్యను అంతమొందించుటకు
అనుమునిగిరిలో అవతరించి
ఎద ఎదలో వేద సారాలను
వెదజల్లుతూ వెలుగుచున్నది
వేదాంతవాణి ...

['వేదాంతవాణి' విజయభేరి పత్రికలోప్రచురితం]

## నేను అక్షరాన్ని

జనం గళాన యుగళమై నిలుస్తా
ఆకలి డొక్కలడప్పునై అరుస్తా
ఆర్తి గుండెకు దాహార్తినై కదుల్తా
విగత జీవుల
వెన్నుపై చరుస్తా
సమస్యల సాధనకు
దారినై నడుస్తా
అవినీతి అంతానికి
అగ్గినై రగులుతా
అడుగంటిన ఆశలలో
అంకురమై మొలుస్తా
నేను అక్షరాన్ని
తెలుగు తల్లి కరుణా కటాక్షాన్ని
చీకటిలోకాన ఉషోదయాన్ని
అభయమిచ్చే ఆయుధాన్ని
[ 'సౌమ్య' మాసపత్రికలో ప్రచురితం ]



## అక్షరదీపం

వెలగాలి అక్షరదీపం
వేల వేల కాంతులతో
శ్రమజీవుల ఆశల్లో జ్వాలగా
విద్యావిహీన హృదయాలపై
సంధించిన రామబాణంలా
వెలగాలి అక్షరదీపం
వేల వేల కాంతులతో
అంకురించిన ఆశయాలతో
పరిమళాలు పంచే విరజాజిలా
ప్రతి ఎదలో విజ్ఞాన వెలుగులను
ప్రసరింపజేస్తూ
వెలగాలి అక్షరదీపం
వేల వేల కాంతులతో
[ 'అక్షరకిరణం'పక్ష పత్రికలో ప్రచురితం ]

## క్రొత్త సంవత్సరం

ఈ నూతన వత్సర ప్రభాత
అమృత శుభోదయాన
మన హృదయవనంలో
స్నేహసుధలు చిలికే దివ్య
మనోజ్ఞ శోభాయుతమైన
సరిక్రొత్త ప్రేమ సుమ వాటిని నాటాలి
అది ప్రాగ్ దిశల సుగంధభావ
పరిమళములు చిందేలా ...

## వసంతమా

ఓ వసంతమా!
ఒక్కసారి రావమ్మ
నీ తెలంగాణ పుట్టినింటికీ
ఓసారి వచ్చి పోవమ్మా!
నీ రాకతో ఈ పుడమి
పరవశంతో పులకించును
నీ నవ్వుల వానలతో
మదుల నదులు నిండును
మా మనస్సులంతా నీ సొంతం
మము కరుణించు మరి కొంచెం
మన అన్న రైతన్న
మదనపడుతున్నాడు
మా చెలిపై ఒక్కసారి
వచ్చి పోవమ్మా
తల్లి మనస్సున్న
ఈ పల్లెటూళ్ళకీ
వల్లె నిండుగ మేము
వడిబియ్యమెట్టేము
కనుల పండుగలా
కాళ్ళపారాణి అద్దేము
ఈ బీడు భూమిన
తిరుగాడు సస్యశ్యామలిపై





నిరాశవీడని జీవచ్ఛవాలకు
నీ రాకే ఏరువాక కావాలని
కలహంసపై నీవు
కదలి రావమ్మ
కవుల కలముల యందు
కావ్యఝురులు జారగా
సవ్యదిశకు నవ్యరాణిపై
మము నడిపించే నాయిక వాణిపై
ఒక్కసారి రావమ్మ
మా వరాల వసంతమా!

## జీవనాడి

చిన్నప్పుడు పండుగంటే
భలే సంబర మవుతుండె
ఇప్పటి ఈ సంక్రాంతి
వెలుగు లేని ఒక క్రాంతి
తరిగిపోయిన తెలుగు సంస్కృతి,
గతి తప్పిన జీవనాడి
పేరుకు మాత్రమే మిగిలిన ఆనవాయితి
మనిషి, మనిషికీ మధ్య రేగుతున్న
ఈర్షాద్వేషాల భోగి మంటలు
అధిక ధరల అంటురోగాలు
తలంటుస్నానం పోస్తుంటే
అవినీతి పాలు పొంగి, ఏనాడో
నీతి ఎదుగుదల ఆరిపోయె
విదేశీ చానళ్ళ విశ్వరూపం
విసిరేయబడ్డ తెలుగు సంస్కృతికి ప్రతిరూపం
అధికారపు కనుసన్నలలో
అక్రమార్కుల బసవన్నలు
దురాశ రసాయనాలతో
నిస్సారమైన పంట పొలాలు
ఎన్ని చదువులు చదివినా ఉద్యోగాలు ఉండవు
ఎన్ని పంటలు పండిద్దామన్నా
వానలు కురవవు రీతి మారిన ఈ ధరిత్రిలో
సంకుచితాల గాత్రమే తప్ప
సంకురాత్రి సంబరం ఎక్కడా?
అది ఏనాడో అంబరానికెగిసింది
ఇక మిగిలినదంతా ఉత్త ఆడంబరమే...



## నీకోసం చిగురిస్తా

నేస్తం! ఓ ప్రియనేస్తం!!
నీకోసం చిగురిస్తా
ఎద పెల్లుపై విరబూస్తా
ఆదరణ కరుపై
బజారున సరుకై
అమ్ముడవుతున్న నన్ను
అంతరంగమెరిగిన దానిలా
ఆప్యాయత కురిపించావు
కొన ఊపిరిగా ఉన్న నాకు
కొత్త ఆశలు తొడిగినావు
చెలిమి కోరకనే నాకు
చేయూత నిచ్చినావు
పెరటి పాదును చదును చేసి
పుడమి ఎదలో నన్ను దాచి
నాలోని నిరాశను తుంచావు
నిండైన అనుబంధాన్ని పంచావు
అనునిత్యం అమృతధార నందిస్తూ
నీ చిరుహస్తంతో నన్ను సృజిస్తావు
ఇంపైన హృదయంతో ఆనందిస్తావు
చాలు నేస్తం, ఈ జన్మకిదిచాలు
పలుకరించే నీ చిరునవ్వుకై
ప్రతి ఉదయం పేచివుంటా
మళ్ళీ మళ్ళీ చిగురిస్తా
ఎదపెల్లుపై విరబూస్తా
మరుజన్మకైనా నీకోసం ఎదురుచూస్తా...

## ప్రేమకై

ప్రేమించాలనీ,
ఆ ప్రేమకై జీవించాలనీ
నా హృదయాంతరాలంలో
ఊహల ఊయల ఊగింది
దారి తెన్ను లేక సుదూరం సాగింది
ఊగీ...ఊగీ...
కాలమనే జలపాతంలో
కలుస్తుందనుకున్నాను, అదీ ఒక
కలగానే మిగిలి పోతుందనుకున్నాను
కానీ...కానీ...
శిశిరంలో వసంతంలా
నీ సునిశిత సుమాగమంతో,
నాలో కోటి కోర్కెల
రెక్కలు విచ్చుకుంటున్నాయి
నీ ఊహల కుసుమ సుమ వనాన
నన్ను విహంగమై, విహరింపజేస్తున్నాయి
పదే... పదే ...
నా హృది మధురోహాలమయమై
మనస్సు పరవళ్ళ లోగిళ్ళలో
పడుచు లేడిలా ఎగిసిపడుతున్నది
పరుచుకొన్న పచ్చనిసిరిలా ...
పండిన పరమార్థపు వరంలా ...



## గెలుపు

నీలోని ప్రతి అణువు
తాకింది ఈ తనువు
నీ పెచ్చని కౌగిలి
రసాను భూతుల లోగిలి
నీ మనసు వలపయితె
నా తలపు పంటవుతుంది
నీ హృదయం పలికిన రాగం
నేను పొందిన మనోనాదము
నీలో ఒదిగిన అనుక్షణం
చైతన్యమగును నాలో ప్రతిక్షణం
రోజూ జరిగే, ఈ
రుణానుబంధపు మధనంలో
నను గెలిపించాలనే
నీవు అందించే సహకారం ముందు
ప్రతిసారి నేవోడి పోతున్నా నిజంగా....

## బుద్ధి శుద్ధులు

శుద్ధి గలిగిన బుద్ధి కలుగును
బుద్ధిగూడిన చిత్తశుద్ధి పెరుగును
హృద్యమందున బుద్ధి, శుద్ధులు
యొద్దికను ఒనగూడిన
సిద్ధుడతడే, బుద్ధుడతడే ...

## చుక్కాని

నీవు ప్రాణమై
నాకు ఊపిరి పోస్తావు
నీవు జీవమై
నన్ను మనిషిని చేస్తావు
నీవు రహదారివై
నన్ను నడిపిస్తావు
నీవు పుడమివై
నన్ను పులకింపజేస్తావు
నీవు తారకవై
నాకు వెలుగునిస్తావు
ఆకలివేళ అన్నమౌతావు
నా కష్టాన్ని నీ కడుపులో దాస్తావు
అలసిన వేళ నాకు ఆశ్రమమౌతావు
జీవన సౌందర్యానికి మాధుర్యమౌతావు
ఆనందాల అంచుకు తోస్తావు
నా ఆశలకు రూపానివౌతావు
దారితెన్ను లేనినాడు, నీవె
రథసారధి వౌతావు,
నీవు నాకు అన్నీ అవుతావు,
కాని నేను మాత్రం
నీకు ఏమికాలేకపోతాను
రెండుచేతులెత్తి జోహార్లు
చెప్పటం తప్ప మరేం చేయగలను?
మరు జన్మ ఎత్తినా నీకు మళ్ళీ
ఋణపడిపోతాను కదా!





## నమ్మలేను నేస్తం

సున్నితంగా కనిపించావు
సన్నిహితమై పలుకరించావు
అపురూపమని పించావు
అరమరికలా కలిసొచ్చావు
ఆకాశానికెత్తేశావు
స్నేహితమని చేయి కలిపావు
అవసరాలు తీర్చుకున్నావు
అణువణువూ కదిలించావు
ఆలోచనలకు తావిచ్చావు
నీకోసమే నేనన్నావు
నిలువెల్లా పులకింపజేశావు
నిను తలవని క్షణమంటూ
నాకు లేకుండా చేశావు
నిజంగా నిజమని నమ్మాను
నీ ధ్యాసలో నేను నిండుగా మునిగాను
నా శ్వాసలో నీ విశ్వాసముంచాను
పదిలంగా ఉన్న మది పగిలేలా చేశావు
కాసిన పండ్లకోసం
చెట్టు మొదళ్ళను నరికావు
విశ్వాసఘాతం వినయంగా చేశావు
మోహ నాటకంలో నన్ను విరోధిగా మార్చావు
నలుగురి ముందు నన్ను అవమాన పర్చావు
నలువైపులా నాపై విషబీజాలు చల్లావు
ఎన్ని చేసినా ... ఇంత జరిగినా ...
నన్ను నయవంచన చేశావనీ
నేను ఇంకా నమ్మలేకున్నాను నేస్తం ...
అంతగా ప్రేమించాను నిన్ను ...

## స్పర్శకోసం

ఈ నిరీక్షణ నీ కోసం
ఈ పరితపన నీ స్పర్శకోసం
నీవురాని క్షణాలు
నిరాశ నిండిన యుగాలు
నీ అలసత్వం
కలిగించు నాలో చపలత్వం
అణువణువు ఆర్ధ్రహృదయుడనై
నీ కోసం నేను వేచివున్నా
నా కళ్ళ వెన్నెలలు
నీ రాకకోరె చకోరాలు
నా ప్రతి ఊహలలో
నీ చూపు నన్నుతాకు ప్రేమ కలాపాలు
నిన్నటి రాత్రికలలో
నాలో ఉరకలెత్తిన జ్ఞాపకాలు
ఈ హృదయపు కుదుళ్ళ లోతుల్లో
నిక్షిప్తమై ఉన్నవి నీ ఆనవాళ్ళు
నా ఎదురు చూపులు
ఎండమావులు కానివ్వకు
నీ స్మృతి బిందువు ఒక్కటి చాలు
నా ఎద సింధువు ఓలలాడుటకు
నీవు నాతో కలిసే ప్రతిక్షణం
సమస్త ప్రకృతి పులకించును అనంతం





## పగటి కల

ఆనాడు తెల్లదొరల పాలిషు బూట్లు
మన ఆడపడుచుల మాన ప్రాణాలు
అణగదొక్కిన నాడు
పల్లె పల్లెన ప్రజారక్తం
పెల్లుబికిన నాడు
పసిపిల్లల పెను రోదనలు
తెల్లవారి తూటాలకు
పల్లవిగా మారిననాడు
ప్రాణం, పరపతి పణంగాపెట్టి
ప్రజాక్షేమమనే పంథాపైపుకు
పరుగులెత్తారు పాలకులానాడు
ఎందరి త్యాగ ఫలంగానో
సాధించిన ఈ స్వాతంత్ర్యాన్ని
నేడు కొందరు నాయకులు తమ
స్వంత తంత్రంగా కూర్చుకున్నారు
ప్రజా సంక్షేమనే పగటికలలో
పడతుల మానాలకు వెలలా?
సంస్కారంలేని ఈ చదువులెందుకు?
పథకాలెన్ని వేసిన బడుగువర్గాల
అభ్యున్నతి కావడం లేదేలా?
ప్రజాస్వామ్యమను పవిత్ర వ్యవస్థలో
రీతిగా పెరిగే అవినీతికి పట్టమెందుకు?

ప్రజా ప్రతినిధుల పేరున
పరువు తక్కువ పనులేల?
దేశసేవకు పదవులే కావాల?
మేధావుల్లేని పదవులు మాత్రమేల
తరతరాలుగా మన తెలుగు తల్లికి
తెల్లచీర తప్పడం లేదేల?
న్యాయదేవత కళ్ళకు నల్ల
గంతలెంత కాలమిల?
మానవత్వం లోపించిన
మత స్వాతంత్ర్యమదేల?
మాతృత్వాన మమతమచ్చుకైనాలేక
లోకం చూడని పసికందుల మరణమేల?
కూర్చున్నకొమ్మనే నరుక్కున్న చందాన
ఉన్న ప్రకృతి వనరుల వికృత పర్చడమేల?
తిన్న ఇంటివాసాల లెక్కకు మల్లె
కన్నదేశాన్ని కాలదన్నడమేల?
ఇది ప్రజాసంక్షేమం అనాలా? పగటి కల అనాలా?





## ప్రలోభం

పగులుతోంది పల్లె గుండె
రగులుతున్న పగలతో
ఎలక్షన్లు రాకముందు
సలక్షణమే మా ఊరు
ఎన్నికల కోలాహలం
రేపుతుంది కలకలం
వీధి వీధి వాదనలు
గోడ గోడ నినాదాలు
ప్రగతి మాట దేవుడెరుగు
పగలబాట దాపురించె
నిన్నటిదాక ఉన్నబంధం
ఈనాటితోన మారిపోయె
ఆప్యాయత అడుగంటి
అనుమానం అధికమాయె
వెల్లువెత్తు ఎదలు కూడ
నిలువెల్లా పగులుబారె
లాభమెవ్వరికో తుదకు
ప్రలోభమే మిగిలె కడకు

# పల్లె మారిపోతున్నది

పల్లెమారి పోతున్నది
పల్లె రూపు మారుతున్నది
పలకరింపులు లేవిప్పుడు
పలుకరించే నాథుడు లేడిప్పుడు
చేలకు పట్టె చీడంతా
పల్లెకు పాకింది ఈనాడు
వరి పొలాలు, జొన్నసేలు
వట్టిపోయి ప్లాట్లుమొలిచె
పల్లెమారి పోతున్నది
పల్లె రూపు మారుతున్నది

దాహార్తి తీర్చు బావుల్లేవు
సేదతీర్చు చెట్లులేవు
స్టార్ టీవీలు, డిష్ కనెక్షన్లు
ప్రతి ఇంట కొలువుదీరె
పల్లెమారి పోతున్నది
పల్లె రూపు మారుతున్నది

పాఠశాల మోటుదాయె
కాన్వెంటుల మోజుపెరిగే
అమ్మా నాన్న అడుగంటె
మమ్మీ డాడి అవతరించె
పల్లెమారి పోతున్నది
పల్లె రూపు మారుతున్నది




సాంప్రదాయపు చీరలెన్నో
నైటీలుగా మారిపోయె
పంచె చొక్కా చిత్రంగా
షాటు, స్లీవులెస్ గా మారిపాయె
పల్లెమారి పోతున్నది
పల్లె రూపు మారుతున్నది

ప్లాస్టిక్కుల మయమాయె
పచ్చతోరణం కరువాయె
ఆటలన్నీ మాసిపోయి
కిరికెట్టుల పోటీపెరిగే
పల్లెమారి పోతున్నది
పల్లె రూపు మారుతున్నది

చెట్టు కల్లు చేదు ఆయె
విస్కీ, బ్రాందీ తీపిఆయే
కాయకష్టం తగ్గిపోయె
కాలమెంత మారిపాయె
పల్లెమారి పోతున్నది
పల్లె రూపు మారుతున్నది

రెక్కలాడక, దిక్కుతోచక
బక్కజనము వలసపోయిరి
వలసపేరున ఒక్కరొక్కరు
దిక్కుదిక్కుకు తరలిపోయిరి
పల్లెమారి పోతున్నది
నా పల్లె రూపు మారుతున్నది

## కరువు గోస

కరువు ఏకరువు పెట్టినా
కనికరించేవారు కరువైనారు
ప్రకృతి మాత పరితపిస్తున్నది
ఆకలికేక తనపిడికిలి బిగిస్తున్నది
మొక్కల జీవితాలన్నీ
మోడువారి పోతున్నవి
పంటపొలాల నొసట
పగుళ్ళ రేఖలు విచ్చుకుంటున్నవి
పొలమ్మిన చోట్లన్నీ
పశువులమ్మే ఘాట్లైనవి
పేగులెండిన వాగులన్నీ
కరువు కరువని అరవసాగె
మనుషుల్లోన మానవత్వం
దినదినము దిగజారిపోయె
సాధ్యమవ్వని సేద్యమేమో
సాగుచేయగ చోద్యమాయె
గూడు విడిచిన జోడుపక్షులు
తోడుకోసం, నీడకోసం
భోరుభోరున ఏడ్వసాగె
ఈ వింతచూసిన ప్రకృతికూడా
పగలబడి నవ్వసాగె!



## తెలుగు పలుకు

వందనం అభివందనం
తెలుగు భాషకు వందనం
వెలుగులీను తెలుగు సాహితీ
నిత్యనూతన చందనం
భాగ్యదాతకు వందనం
భరతమాతకు వందనం
సుందరం రసబంధురం
తెలుగు పదమే పలుకుదాం
మతములన్నీ హితముకోరి
జతగకలసి శ్రుతులు పాడగా
తెలుగు జ్ఞానం పంచుదాం
దేశ గౌరవం పెంచుదాం
తెలుగు వెలుగుల పరిమళాలను
గుండె గుండెకు పంచుదాం
తెలుగుతల్లి కంటి వెలుగై
ప్రగతి బాటన సాగుదాం
పాలమీగడ, పండువెన్నెల
నారికేళపు నీరు తెలుగని
భరతమాతకు కీర్తి కూర్చిన
తెలుగు చరితం దివ్యభరితం
ప్రేమ తత్వం శాంతితత్వం
తెలుగు భాషకు అర్థమంటూ
తెలుగు పలుకులు పలుకుతుంటే
గగన తారలై వెలుగుతుంటే
పోతపాల భాష విడిచి
తల్లి ఒడికే చేరుదాం
దేశ భాషన తెలుగు లెస్సని
ఎలుగెత్తి చాటుదాం

# కవితా పుష్పం

కవితా పుష్పం పూయిస్తున్నా
కావ్య ఫలములు పండిస్తున్నా
పొంగిన హృదయం
గంగానదై పారగా
చరిత్ర విత్తులు ధరిత్రి నాటగా
కవితా పుష్పం పూయిస్తున్నా
కావ్య ఫలములు పండిస్తున్నా

అనాధ రోదనల విషాద గాథలకు
క్రొత్త ఊపిరుల జీవ నాడులకు
కవితా పుష్పం పూయిస్తున్నా
కావ్య ఫలములు పండిస్తున్నా

వసి వాడిన పసి తనమున
వసంతమే వచ్చురీతిగా
కవితా పుష్పం పూయిస్తున్నా
కావ్య ఫలములు పండిస్తున్నా

ఒంటరి బ్రతుకున కంటికి వెలుగై
స్వేద బిందువె హృదయ బంధువై
కవితా పుష్పం పూయిస్తున్నా
కావ్య ఫలములు పండిస్తున్నా

అమృతత్వమగు
సాహిత్య సత్యమును
విశాల జగాన వికసింపజేయుటకు
కవితా పుష్పం పూయిస్తున్నా
కావ్య ఫలములు పండిస్తున్నా





# శాంతి కేతనము

విశాల ప్రపంచపు వినువీధుల్లో
శాంతి పతాక ఎగిరెయ్యాలి
అజ్ఞాన వీధుల్లో విజ్ఞాన దీపాలై
భారత యువత ముందుండాలి

ఐకమత్యమే తమ ఆయుధమై
అనంత కళలలో తలమానికమై
విశాల ప్రపంచపు విను వీధుల్లో
శాంతి పతాక వికసించాలి

విశ్వ మానవ శ్రేయస్సే తమ విధిగా
వినయ సంపత్తియే వారి ఊపిరిగా
భవితవ్యానికే బాటగా
అభ్యుదయమే తమ పాటగా
విశాల ప్రపంచపు విను వీధుల్లో
శాంతి పతాక విలసిల్లాలి
మానవ జాగృత మొనరించిన
భవ్య భారత జాతి మనది
దివ్యజ్ఞానజ్యోతులు వెలిసిన
పుణ్య చరిత ఖ్యాతి మనది
విశాల ప్రపంచపు విను వీధుల్లో
శాంతి పతాక ఎగిరెయ్యాలి
శాంతి పతాక ఎగిరెయ్యాలి

## తెలుసుకో మసలుకో

ఏమవుతుందోనని భయమెందుకో
నీకోసం నీవేనని తెలుసుకో
గుండె నిండ గాలిని పీల్చుకో
అన్ని నీ మంచికేనని అనుకో
అనుక్షణం ఆశను పెంచుకో
ఈ క్షణమే నిరాశను మానుకో
బాధలైనా, కష్టాలైనా అథితులేననుకో
కష్టించడం నువ్వు నేర్చుకో
సుఖ జీవనం మరి పెంచుకో
శ్రమ శక్తిని నమ్ముకో
ప్రతిభ నీలో పరిమళించును చూసుకో
ద్వేషముంటే త్రుంచుకో
స్వార్థమించుక వదులుకో
విశ్వాసమను శ్వాస నింపుకో
ఉత్సాహం నీలో ఉరకలెత్తును చూసుకో
స్వేదమెప్పుడు వృథా కాదు ఓర్చుకో
కష్టం వెంటే సుఖముందని నేర్చుకో
ఎందుకో దిగులెందుకో
ముందు ఉన్న ఫలము  నీదే అందుకో
నిన్ను నీవే మలచుకో
ప్రేమ పంచుట తెలుసుకో
తప్పులెంచుట మానుకో
జీవితం కొంచమేనని తెలుసుకో
మంచి వైపు అడుగులేయుట నేర్చుకో
నిజమాత్మ నీవేనని నమ్ముకో
పరమాత్మపైనే మనస్సును నిలుపుకో
ఈ తనువు కూడా అద్దె ఇల్లేననుకో
ఆట ముగిసితే అంతా మట్టేనని తెలుసుకో
సమయమింకా మించలేదు మేలుకో





## ఎండమావి

చిగురించని ఆశలతో
చివరిదాకా పోరాడి
పిల్ల జెల్ల గూడు విడిచి
పల్లె పక్షి పయనమాయె
చినుకు లేక చేను లేక
త్రాగగుక్క నీరులేక
పనికోసం పాకులాడి
పరువుపోయె పస్తులాయె
పలుగుపార విలువపోయె
బుల్‌డోజర్‌ల రాజ్యమాయె
కండబలం తగ్గిపాయె
కాళ్ళుజేతులెండిపాయె
బలమున్న గొప్పోల్లకు
కులవర్గం గుర్తుకొరకు
ప్రజలకోసం పథకమనిరి
తమ పొట్టలు నింపుకునిరి
కసిగాయలు వసివాడి
కళ్ళు కడుపు పల్లమాయె
మంచంలో ముసలిపక్షి
మూల్గులతో మాడిపోయె
రాబందుల రాజ్యంలో
ఏ బంధువు లేకపాయె
కష్టకాలం స్పష్టమాయె
వలసమాత్రం తప్పదాయె

## మనోదయం

నా హృదయం తపిస్తున్నది
బీటలు వారిన బ్రతుకుల్లో
సరికొత్త బాటను నిర్మించాలనీ
చీకటి మాటున కూరిన వారికి
దివిటి వెలుగును పంచాలనీ
నా హృదయం తపిస్తున్నది
బండబారిన గుండెలలో
కొండబలం నింపాలనీ
వ్యథాభరిత హృదయంలో
సుధారసం చిలకాలనీ
నా హృదయం తపిస్తున్నది
స్వార్థపు శిలలను పైపెచ్చు తొలగించి
నిస్వార్థపు శిల్పాలుగా చెక్కాలనీ
నయవంచన సెగళ్ళను
మొదలెత్తకుండా తుంచాలనీ
నా హృదయం తపిస్తున్నది.





## చిరునామా

నేటి ఈ మానవత్వపు సమాజంలో
సమానత్వం ఎక్కడని
నీ వడిగిన ప్రశ్నకు సమాధానం
ఇదుగో ఇక్కడే ఈ ఊరు
చివర ఉన్న స్మశానవాటిక!
ఇక్కడే జరుగుతోంది నవసమాజ
నిర్మాణానికి నిత్యాగ్నిహోత్రం,
సమజీవన సుమభావనకు
నవ సమాజ సంస్థాపనం
రత్నాలు ధరించిన రాజులు
రాళ్ళు మోసిన కూలీలు
అందాలొలికిన సుందరులు
అంటురోగ పీడితులు
అందరూ, అందరూ ఇక్కడ సమానమే
కల్తీసారా కంఠంలో దిగిన కార్మికులు
బ్రతుకు దారిలో తప్పిన అనామకులు
బాధల బ్రతుకు భారమై
భవిత శూన్యమైన భావి పౌరులు
అందరిని సమానంగా ఆహ్వానించే
అరుదైన సమసమాజం
ఆకలి మంటలు, అస్తులగొడవలు

రాగద్వేషాలు, రక్త సంబంధాలు లేని
నిజ సమాజం ఇదే ఇదే,
ఇక్కడికి విచ్చేసే ప్రతివారికి
అనంతశాంతి నిచ్చి
శాశ్వత సేదతీర్చే
మరో అమ్మవడిలాంటి
కమ్మని అమృతహృదయిని
ఈ స్మశాన వాటికామ తల్లీ ...

[ 'పసిడిముగ్గులు' కవితా సంకలనంలో ప్రచురితం]





## నివేదన

అమ్మ ఒడినుండి
అక్షరాల గుడి వరకు
అనుభవాల సారంలో
ఆలోచనా సరళి ఒంపి
పదము పదము జేర్చి
పద్యమొకటిగా కూర్చి
హృదయామోదము తోడ
పూదండగా మార్చి
పాదమంటన తెలుగు
విద్యలొసగెడి తల్లికి
విధేయప్రణతు లిడగా ...

## ఆయుధం

కలం చేతిలో ఉంది
బలం గుండెలో ఉంది
పదం కలంలో ఉంది
స్వేదం చిందే హృదయం ఉంది
ఇక ఆమోదం కోసం ఆగడమెందుకు?
కవులారా! కులాల బలాలపై
కలాల కత్తులు ఝుళిపించండి
పదునైన మీ మేధాయుధాలతో
అన్యాయపు అవినీతిని నరకండి
కదలండి కరవాలమై నడవండి

## మబ్బు తెర

కప్పుకున్న నల్లని ముసుగును
ఆకాశం మెల్లగా తెరిచిందప్పుడే
పిల్ల తెమ్మరలింకా చల్లగాలి
ఆటలు ఆడుతూనే వున్నాయి
వైరస్ సోకిన వదనంతో
మనిషి ఇంకా ముసుగుతన్నే వున్నాడు
నిద్దుర లేస్తే బ్రతుకు అద్దం
బద్దలవుతుందనుకున్నాడో ఏమో!
మసకబారిన సమాజాన్ని మళ్ళీ
మోసపు కళ్ళతో చూడలేక
మదిలోనే మహాయుద్ధపు
ప్రతిపాదనల ప్రకటనలు చేస్తూ ...
నిన్నటి తాలూకు జ్ఞాపకాల
వ్యాపకాలను ఒక్కొక్కటి తలుచుకుంటూ
ఒకసారి మంచులా కరుగుతున్నాడు
మరోసారి మండెగుండెతో రగులుతున్నాడు
బ్రతుకుబాటకు వెతుకులాట
తప్పదనుకున్నాడో ఏమో!
తిరిగి కులుకుల మాయలోకి
కునుకు మునకలు వేస్తున్నాడు
వినిమయ బద్ధ నిశ్శబ్దంలోనుంచి
కొద్దిగా తలుపు తీసిన శబ్దం
బద్ధకానికున్న హద్దును చెరిపేస్తూ
నియమబద్ధంగా తెరుచుకుంది
పేడితాపాన్ని తట్టుకోలేని
గాలికెరటం ఒకటి
చొరవతీసుకొని లోనికి దూసుకొచ్చింది
మనస్సుకు పట్టిన
మబ్బు తెరను తొలగిస్తూ





## ఎదురుచూపు

వరమిస్తాడనీ వానదేవుడు,
వరిమొలుస్తుందని బడుగుజీవుడు
ఎన్నాళ్ళుగానో ఎదురుచూస్తూనేవున్నారు

వనిత తావలచి వస్తుందని ప్రేమికుడు
కలల రాకుమారుడు తనను
వరించి వస్తాడని కన్నె మనస్సులు
ఎన్నాళ్ళుగానో ఎదురుచూస్తూనేవున్నారు

ప్రతిరోజు దీపావళి రావాలనీ,
పాఠశాల సెలవులింకా పెరగాలనీ
పిల్లలెప్పుడూ ఎదురుచూస్తూనేవున్నారు

ఓట్లేసిన ప్రతిసారీ తమ సమస్యలన్నీ
తీరుతాయని ఓటరుమహాశయులు,
పాలకపక్షాన్ని ఏ క్షణానైనగద్దె దించాలనీ
ప్రతిపక్షంవాళ్ళు ఎన్నాళ్ళుగానో
ఎదురుచూస్తూనేవున్నారు

ఎన్నికల ముందుచేసిన వాగ్దానాలను
ఎన్నికైనవెంటనే నాయకులు నెరవేర్చుతారని ప్రజలు
ఎన్నాళ్ళుగానో ఎదురుచూస్తూనేవున్నారు
సమయానుసారంగా మన రైళ్ళు వస్తాయేమోనని
సగటు ప్రయాణికుడు
ఎన్నాళ్ళుగానో ఎదురుచూస్తూనేవున్నారు

పసితనం తిరిగిరావాలనీ వయసైపోనవారు
తాముకన్న కలలన్నీ తమ పిల్లలు నిజం
చేస్తారని కన్నవారు....
ఎన్నాళ్ళుగానో ఎదురుచూస్తూనేవున్నారు

పండించిన పంటకు సరియైన
గిట్టుబాటు ధర
ఈసారియైనా వస్తుందేమోనని రైతు,
స్త్రీలపై అత్యాచారాలింకనైనా తగ్గుతాయెమోనని
మహిళా సంఘాలు,
ఎన్నాళ్ళుగానో ఎదురుచూస్తూనేవున్నారు

సమ సమాజం రావాలంటూ మావోయిష్టులు
మతం మాదేగొప్పదౌతుందంటూ మతవాదులు
ఎన్నాళ్ళుగానో ఎదురుచూస్తూనేవున్నారు

కులం నీడలపై గోడలఎత్తు
పెరుగరాదంటూ హితవాదులు,
తుపాకి గొట్టంతోనే
సమానత్వం వస్తుందని తీవ్రవాదులు
ఎన్నాళ్ళుగానో ఎదురుచూస్తూనేవున్నారు

లేని ప్రతిభకు గుర్తింపు
రావాలంటూ ఆరంభశూరులు,
ఉన్నధనాన్నింకా ఎలాపెంచు
కోవాలంటూ ధనవంతులు
ఎన్నాళ్ళుగానో ఎదురుచూస్తూనేవున్నారు

తమ శ్రమకు తగిన ప్రతిఫలం
దొరకాలని శ్రామికులు,
తమ దోపిడికింకా 'ఎరలు'
కావాలనీ దోపిడిదారులు
ఎన్నాళ్ళుగానో ఎదురుచూస్తూనేవున్నారు





గాంధీకలలుకన్న గ్రామస్వరాజ్యం
వస్తుందని గాంధేయవాదులు,
కష్టమంటూ లేకుండా ఎన్నో
లాభాలు పొందాలని సగటు మానవుడూ
ఎన్నాళ్ళుగానో ఎదురుచూస్తూనేవున్నారు

అణ్వస్త్రాల పెంపుదలే దేశానికి రక్షణ
అనుకునే దేశాధినేతలు
కంప్యూటర్ యుగంలో కూడా
రాతియుగపు పోకడలతో
మనిషి ఆలోచనాతీరు
ఇకనైనా మారుతుందేమోననీ సనాతనుడు
ఎన్నాళ్ళుగానో ఎదురుచూస్తూనేవున్నారు

## నిజం

ఊహలన్నీ నిజం కాకపోవచ్చు
కానీ, నీ ఊహలతోనె నిండిఉన్న
ఈ గుండె మాత్రం నిజం
కళ్ళతో చూసిందంతా నిజం కాకపోవచ్చు
కానీ, నీ కలలన్ని నింపుకున్న
నా మనస్సు మాత్రం నిజం
చేసిన బాసలన్నీ నిజం కాకపోవచ్చు
కానీ, నీ ఊసులన్ని దాచుకున్న
ఈ హృదయం మాత్రం నిజం
ఆశలన్నీ అడియాసలు కాకపోవచ్చు
కానీ నీ మీద నేపెట్టుకున్న ఆశమాత్రం
నిరాశ కాదన్నది నిజంగా నిజం





## ఏది మాకు దారి

గుడి అయినా
బడి అయినా
నీవు కూర్చున్న గద్దె అయినా
నిను మోసె పాడె అయినా
మా రెక్కలు ఆడనిదే
మా చెమటలు చిందనిదే
నిర్మాణానికి నోచుకోవు
మీ చరిత్ర నిలుపబోవు
కొండలను పిండిచేసి
నిర్మించిన వంతెనైనా
భూమిదున్ని, అరుకుదోలి
పండించిన పంటనైనా
మా కండలు కరగనిదే
మా శ్రమను ఒంపనిదే
మీ గొంతులు తడువబోవు
మీ కడుపులు నిండబోవు
మా ఊడిగం సాగపోతే
మీ ఊపిరి ఆగిపోవు
మా నెత్తురు చిందకుంటే

మీ చలనం నిలిచిపోవు
మా శ్రమకు లేని అంటరానితనం
మాకు మాత్రమెందుకొచ్చె?
మా చెమటకులేని విలువ
మీ పెత్తనానికేల వచ్చె?
తల్లిపాలు త్రాగి రొమ్ముగుద్దె
సంస్కృతిమీది
కుటిలనీతి, దోపిడిజాతి
కుతంత్రాల ప్రణాళిక మీది
కాయకష్టమె మాకు తెలిసిన నైజం
మా శ్రమతో సృష్టించిన
సమస్తం మీ సొంతం
మీ ఆస్తులు పెరుగుతుంటె
మా కడుపులు మాడుతుంటె
మీ భవనం పైకి లేస్తే
మా గుడిసెలు కూలుతుంటె
మా బొక్కలు అరుగుతుంటె
మా డొక్కలు తరుగుతుంటె
మా బ్రతుకులు భారమై
మనుగడనే నరకమైతె
వలసమాకు రహదారి
లేదంటె, ఆకలిచావులే దారి



## అంతర్వాహిని

అలల చెలికాడు
సెచ్చెలి కడలిని
అలవోకగా తాకి
తొలిగిలిగింత పెట్టినవేళ
నీ తలపు నాలో ఊగిసలాడింది
నా ఆశకు జీవం నీవంది
నా శ్వాసకు ఊపిరి నీవంది
నా భాషకు భావం నీవంది
నా ఆరాధనకు రూపం నీవంది
నా శోధనల రససాధన నీవే అంది
అందుకే ఓ ప్రియతమా
నీవు చినుకై పలుకరిస్తే
నేను పుడమై పులకరిస్తా
నీవు కిరణమై తాకితే
నేను కమలమై వికసిస్తా
నీవు కవనమై సాగితే
నేను కవితనై పొంగుతా
నీవు వేణువై వినిపిస్తే
నేను శ్రోతనై పులకిస్తా
నీవు భాషవై ఉదయిస్తే
నేను భావమై స్పందిస్తా
నీవు దీపమై వెలిగితే
నేను ప్రమిదగా మారుతా
నీవు విరిసే పుష్పానివైతే
నేను పరిమళమై వ్యాపిస్తా...

# భవితగమనం ఎక్కడికో

స్వార్థం
మంచి తనానికి స్థానం లేకుండా
మానవత్వాన్ని మసిచేస్తోంది
పాలక సమాజం
మనిషిగా బతికేందుకే మాత్రం
అవకాశం లేకుండా చేస్తోంది
ఇది ఈనాటి చరిత్రే కాదు
అనాటి నుంచీ నడుస్తున్న చరిత్రే
ఇది గత చరిత్రే, పాత చరిత్రే
అయినా నవ చరిత్రే
మొన్న మన జాతిపిత మహాత్ముడు
నిన్న మన అమ్మ ఇందిర
నేడు రాజీవుడు
గాడ్సేలు, అభినవ గాడ్సేలు
మట్టిలో కలిపేస్తుంటే
మానవులే ఉండరు
దానవులే ఉండిపోతారు
రాక్షసత్వ రాజ్యంలో
రక్తం జీవనదులుగా పారుతోంది
ప్రాణాలు తూటాలకు రాలుతున్నాయి
అతివ గుండెలను చీల్చికాల్చుతూ
అమ్మ అనే పదాన్నే అవమానిస్తూ
నంజుకు తింటున్న కీచక పర్వాలు
చూస్తూ స్పందించని యువత
బృహన్నలత్వానికి సింహాసనమేస్తుంటే
భవిత నీ గమనం ఎటువైపు?
అది ప్రశ్నార్థకమేనా?
['పాలమూరు కవిత' కవితా సంకలనంలో ప్రచురితం]





# రండి మనదేశాన్ని రక్షించుకుందాం

రండి మనదేశాన్ని రక్షించుకుందాం
శాంతి మాటల మూటలు కట్టి
మర ఫిరంగుల బావుటాలు పట్టి
పంట పొలాల్లో మాదకద్రవ్యాలు పండిద్దాం
పచ్చని మొక్కలకు మారణాయుధాలు కాయిద్దాం
రండి మనదేశాన్ని రక్షించుకుందాం

త్రాగునీటి ఊటలు మరిచి
తలా పెట్రోలు బావుల్ని తవ్వుకుందాం
విమానాలను తగలకుండా పక్షుల్ని తరిమేద్దాం
భాష్పవాయువులు పేల్చి
కృత్రిమ మేఘాలను సృష్టిద్దాం
రండి మనదేశాన్ని రక్షించుకుందాం

పండుగనాటి ఆప్యాయతలు విదిలించుకొని
పరువాలొలుకు చీకటి టీవీ
చానళ్ళ నోళ్ళలో తలదూర్చుకుందాం
భారత సంస్కృతిని బాల్చీ తన్నీ
విదేశీ మోజులో మజాగా విహరిద్దాం
రండి మనదేశాన్ని రక్షించుకుందాం

తల్లి భాషకు తిలోదకాలిచ్చి
పొరుగుభాషకు జీవం పోద్దాం

మత్తు మోజులో యావత్ యువత
పరిభ్రమించేలా ప్రణాళిక చేద్దాం
రండి మనదేశాన్ని రక్షించుకుందాం
మనదేశంలోనే ఎన్నో విదేశీ కుట్రలున్న
చూస్తూ పట్టనట్టు వూరుకుందాం!
తల్లి పాలు త్రాగి రొమ్మును గుద్దే వాళ్ళను
చూసి సంకలెగరేద్దాం
రండి మనదేశాన్ని రక్షించుకుందాం
మన విజ్ఞానం, మన తెలివిని
విదేశాలకు విక్రయిద్దాం
పంట పండు పొలాలున్న
పశు సంపద పదిలంగున్న
మూలధనం మూల్గుతున్న
సోమరి తనమే సొగసని అందాం
రండి మనదేశాన్ని రక్షించుకుందాం
పిజ్జా, బర్గర్లు ఫాస్టు ఫుడ్‌లకు క్యూలు కడదాం
పక్షపాతపు పడగనీడన పడిఉందాం
పసి మనస్సులన్నీ మసకబారగొడదాం
వరదలు, భూకంపాలు, వరుస మానవబాంబుల
పెంచి పోషించుకుందాం
అదంతా ప్రకృతిదే తప్పని అందాం
రండి మనదేశాన్ని రక్షించుకుందాం





## ప్రయత్నం

కడుపునిండా తిండి వున్నా
సుఖ భోగాలెన్ని వున్నా
సౌఖ్యం పెంచే మేడలున్నా
సౌభాగ్యాలిచ్చే సాధనాలున్నా
మమత పంచే చల్లని చూపు
ఆప్యాయత నిండిన పలకరింపు
కరువైన జీవితం నరకమేనన్నా
కాళ్ళీడుస్తూ బ్రతికేకన్నా
కాలక్షేపానికి బ్రతుకును బలిచేసేకన్నా
నిరాశ రాసులు నీలో పెరుగుతూ వున్నా
చిరు ప్రయత్నంతో చిన్న దీపం వెలిగించు
అది ఎన్నెన్నో చీకట్లను తొలిగించు
భయపడడమెందుకు
భయపడుతూ బతకడమెందుకు
ఎంతకాలం దాచుకుంటావు
ఎందుకలా తలవంచుకుంటావు
తెగించి ఒక్క అడుగు ముందుకు వెయ్యి
అపజయమప్పుడు వెనకడుగు వేయు
ప్రతిభ వున్నా, పరితపన వున్నా
ప్రణాళిక లేని పగటికలలెన్ని కన్నా
ప్రయత్నం లేక ఫలితం సున్నా
పరిశ్రమతో కలిగే ప్రయోజనమే
అన్నింటికన్నా మిన్న

## సమైక్యతాసారథి

ఓ భారత యువత
కావాలి నీవె విశ్వవిజేత
సాధనమే ధ్యేయమై
సమైక్యతే ఆయుధమై
సాగిపో సాగిపో
వర్ణాలన్నిట సువర్ణమై వెలిగిపో
నవయువ చైతన్యపు
నాయకత్వంలో నవ్యతకు
నాంది పలుకుతూ
సాగిపో సాగిపో
సయోధ్యకే సారథివై వెలిగిపో
జయ జయ నాదంతో
జాతిని జాగృతపరిచి
విజయోత్సాహంతో
జగతిని గెలిచి
సాగిపో సాగిపో
విజేయుడవై వెలిగిపో
ఓ భారత యువత
కావాలి నీవె విశ్వవిజేత
నవలోక యుగపు దూత
ముందుతరాల స్ఫూర్తి దాత

['సూర్యశ్రీ' మాసపత్రికలో ప్రచురితం]



## అమ్మ

తొలి అక్షరాలు లేని
తెలుగు అక్షరమాలలా
అమ్మలేని నేను
అందరిలా ఉండలేను
ఏది కావాలన్న అడగలేను
ఆత్మ న్యూనతకు లోనౌతాను
ఏ తల్లిని చూసినా, నాతల్లి ఇలానే
ఉండేదేమోననిపిస్తుంది
కలిపిన పాలన్నపు ముద్ద
తినిపించ వస్తుందనిపిస్తుంది
ఎవరినోట లాలి పాట విన్నా
అది నా కోసమే ననిపిస్తుంది
గలగలపారే నదిని చూసినపుడల్లా
అమ్మ పలికితే ఇలాగే ఉండొచ్చుననుకుంటూను
నిండుపున్నమి పండువెన్నెల వేళా
అమ్మ నవ్విన ఆనందాల హేళ
లేగదూడ 'అంభా' అని అరచినపుడు
చెమ్మగిల్లె నా కన్నుల సాక్షిగా
నా గుండెలోని ఆర్తి తిరిగి గుర్తుకు వస్తుంది
అమ్మా అని గట్టిగ గొంతెత్తి అరవాలని ఉంది
నాపిలుపు విన్న ఎందరు తల్లులు
నాపైపు జాలిగా చూస్తరో
వారందరి కడుపున బిడ్డగా
పుట్టాలని ఆశగా ఉంటుంది
ఆ తల్లుల పొత్తిల్లలో పసిపాపనై
హాయిగా నిదరోవాలనిపిస్తుంది
బడిలో టీచరమ్మ నా చెవి పట్టి
నులిమి నపుడు , ప్రేమగా నను
తాకుతున్న అమ్మ చేతిస్పర్శ

హాస్టల్ గదిలో ఉన్నప్పుడు
కసిరినా, విసిరేసినా వార్డెనమ్మే నాకు అమ్మ
సెలవులొస్తే, పండగలొస్తే...
తమపిల్లలకోసమొచ్చే తల్లులవైపు
ఆర్తిగా చూసేవి నాకళ్ళూ
రాని అమ్మకోసం లేని ఆశలు
పెట్టుకునేది నా మనసు
లోకమె నావెంటవచ్చినా
అమ్మలేక నేను అనాధనే
ఎన్ని ఉన్నా అమ్మ లేని నేను ఒంటరినే
అమ్మ అరచేతుల్లో ఒదిగి
ఆమె గుండెకు హత్తుకునే
క్షణాలకోసం పరితపిస్తున్నాను
కనిపించే ప్రతి దేవునికి మొక్కుకుంటున్నాను
ఆశలైనా! ఆకలైనా !
అమ్మ తీర్చితేనే అర్థం
ఆటలైనా ! పాటలైనా !
అమ్మఒడిలోనే అందం
అమ్మ ఉన్న ప్రతిఇల్లు
అమృతం పంచు జల్లు